# సూర్యాంశువులు

## రాజు


వెల : 30/-

ముద్రణ : అక్టోబర్, 1996

ప్రతులు : 500

కవర్ డిజైన్
బొమ్మలు : సూర్య

ఫోటోలు : గంగాధర్ రాజు, రమణ, శ్రీనివాస్

ప్రతులకు : రాజు, 7-37, సంగీత్‌నగర్
కూకట్‌పల్లి, హైదరాబాద్ - 500 072, ఫోన్ : 886444

నవోదయ బుక్‌హౌస్
ఆర్యసమాజ్ ఎదురుగా,కాచిగూడ, హైదరాబాద్

విశాలాంధ్ర బుక్‌హౌస్, హైదరాబాద్

కంపోజింగ్
ముద్రణ : ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్, హైదరాబాద్. ఫోన్ : 660000

ఏభై సంవత్సరాల నా స్వతంత్ర భారత పౌరుల సాక్షిగా ...



**వి.వి.యస్.యన్. రాజు** కి

అంకితం

# షాకు మెరుపు కవితలు

రెండు దశాబ్దాలుగా తింటున్నన్ని షాకులు మనిషి మరెప్పుడూ తినలేదేమో! షాకు తిని మొద్దుబారటం ఉంది. మొద్దుబారిన జీవితం షాకుతో చైతన్యవంతం కావటం ఉంది. షాకు రెండంచుల కత్తి. ఎడాపెడా కొడుతుంది. ఈ దశాబ్దంలో మరొక కొత్త పరిణామం వచ్చింది. షాకులను జీర్ణించుకొనే ఒక జడత్వం సమాజంలో ఘనీభవిస్తోంది. షాకు తగిలితే ఈ శతాబ్ది మొదట్లో బుద్ధి దద్దరిల్లి ప్రజ్వలించేది. ఆ తరువాత మనసు మండి భగ్గుమనటం నేర్చుకున్నది. క్రమంగా శరీరం ముక్కలయ్యేటట్లు ప్రేలుతూ వచ్చింది. ఇప్పుడు డైనమేట్ పెట్టినా పగలని గండ శిలగా మారింది. ఈ దశ లన్నింటినీ కవి చూస్తూనే ఉన్నాడు. తన దశను, తన దిశను కలంతో ప్రకటిస్తూనే ఉన్నాడు.

సంస్కరణ చైతన్యం - షాకు తిన్న కవి స్పందించిన మొదటి దశ. భక్తి ఉద్యమం భావకవిత్వోద్యమం - మనసు మండిన వేదన దశ. అభ్యుదయ విప్లవ చైతన్యం రక్తం చిమ్ముతూ గగనానికెగసి నేలపై దూకిన దశ. ఇప్పుడు రక్తాన్నితాగుతూ రాయిగా మారుతున్నదశ. ఈ దశ మృత్యుసదృశమైంది. ఈ కాలంలో కవి కలం నిర్వహించే పాత్ర అపూర్వం....

ఈ దశలోని దుర్దశను గద్గదంగా వినిపిస్తారు కవి రాజు. "నానెత్తురునే తాగుతూ దప్పి తీరక తపించిపోతున్నాను. ఏ ఉదయ కిరణం అంచు మీదుగానో ఒక అమృతబిందువు నా గొంతులోకి జార్చు" (సూర్యకతారి . పుట. 35)

"మృత్యోర్మా అమృతం గమయ" అన్న సమకాలీన సమాజ సంవేదనకు ఇది కేతనం.

సమాజం జడమై పోతుంటే కవి తాను జడుడైపోతూ చావుకేక వేస్తే అది ఒక చావుగుర్తుగా చరిత్రలో మిగిలిపోవచ్చు. కాని, ఇంకా చైతన్యం నాలో ఉంది - నా శిధిల శరీరాన్ని, నా సమాజ జడత్వాన్ని అణువణువునా అమృతంగా మార్చుకుంటాననే ఆత్మ ఘోష వినిపిస్తే ఈ యుగంలోని బ్రతుకు గుర్తుగా భవిష్యత్తుకు కవి మిగులుతాడు.

'రాజు' ఆత్మను అక్షరంలా పలికించే అంతరంగ యోగి.అతడు ఏకతారా మీద పాడుతూ ఉంటాడు. నేను దాదాపు పాతికేళ్ల నుంచి రాజుగారి కవిత్వం వింటున్నాను. 'లేడి చంపిన పులి నెత్తురు' ను గుర్తించిన వేడి గల రోజుల్లోనే నాకు తెలుసు. ఆయన కలం పట్టితే సూర్యుడు! గళం విప్పితే చంద్రుడు. కవితా సంపుటులన్నీ సూర్య సంబంధులైన శీర్షికలతో నిలిచేవే. ఆ ధ్వజాలను ఎగరేసే కవి మాత్రం రాజు.

రాజుగారికి సూర్యుడని పేరున్నట్లైతే బహుశః కొండల్లో గుట్టల్లో భూగర్భాల్లో అడవుల్లో ఉదధుల్లో తిరుగుతుండే వారేమో! రాజుగారు కావటం చేత అక్కడ వాడే ధ్వజాలనూ, రథాలనూ, కఠారునూ, వెలుగుకిరణాలనూ తెచ్చుకొని మన మధ్య తిరుగుతున్నారు. వొట్టి సూర్యుడైతే తూటాలుగా కిరణాలు పేలి ఉండేవి. వొట్టి రాజైతే పూల తోరణాలు కిరణాలు జాలువారేవి. సూర్యధ్వజంతో వచ్చే రాజు కాబట్టి అగ్నిని అందంగా కురిపిస్తారు. అగ్ని వానగా కురుసున్న అనుభూతినిస్తుంది రాజుగారి కవిత.

ఒకనాటి షాకు - రాజులో సూర్యరథం రేపిన దుమ్ములా, ఖండ కావ్య మేఘ ఖండికలను రెచ్చగొట్టింది.

మరొకనాటి షాకు - రాజులో వేదనగా, సంవేదనగా నినదించి దీర్ఘ కవితలుగా తీగలు సాగించింది.

మరొకనాటి షాకు - రాజులో ఆత్మను రగిల్చి మంటల కఠారితో మృత్యువు మీద యుద్ధం చేసి మార్మిక పీయూషాన్ని మధురంగా పిండింది.

మరి ఈనాటి షాకు - రాజులో నిప్పురవ్వలను రువ్వేట్లు చేస్తోంది. ఇదివరలో ఒకషాకుకూ మరొక షాకుకూ కొంత వ్యవధానం ఉండేది. ఇప్పుడు లేదు. ఏనాడైనా భల్లున తెల్లవార కుండానే ముంగిట్లో తలబద్దలు చేసుకునే వార్త మన కందించేది షాకుల బాకుల తోరణాలే. ఎన్నికన్నీళ్లు కార్చినా వార్తాపత్రిక తడిసి పిండుకునే ఓర్పును కోల్పోయింది. మనం ప్రొద్దున్నే చూచే సూర్యకిరణాలు ఇదివరలో షోకులు పోయేవి. ఇప్పుడు షాకుల నిచ్చేవిగా ఉన్నాయి. అందువల్లనే రాజుగారు షాకుల కవితలు రాశారు ఈ సంపుటిలో.

*ఇందులోనివి సూర్యాంశువు లంటారు రాజుగారు.*
*ఇవి ఓజోన్‌పొరను చీల్చు కొని వస్తున్న కాస్మిక్ కిరణాలు*
*ఇవి తగిలిన మంట షాకులకు వెచ్చని గుర్తులు.*
*ఇవి మిగిలిన వేడి గుర్తులకు మెరపుల చురకలు!*

ఇందులోనివి 'మినీకవితలు' కావు. 'హైకూలు' అసలేకావు. అందుకే వీటిని షాకు కవితలంటాను; మెరపు కవిత లంటాను. కొన్ని మెరిసి ఊరుకుంటాయి; మరికొన్ని పిడుగుపాటులా షాకులనిస్తాయి. ఇవి నిజానికి షాకు మెరుపులు. పేరుకు పైకి 'సూర్యాంశువులు'.

షాకుకు కుదిపే శక్తి ఎక్కువ.

షాకు కవితకు చెప్పే ఘాటు ఎక్కువ.

*"రాజకీయం కుటుంబాల పాలైతే*
*ప్రజాస్వామ్యానికి నడివీధిలో పాతర*
*పదవి మీద ఉన్మాదం ప్రకోపిస్తే*
*స్టారుహోటళ్లలో వెన్నుపోటుదార్ల జాతర*
*ఉపద్రవం ఉప్పెనలా ముంచుకొస్తోంది*
*కళ్లు తెరచి దేశాన్ని కాపాడుకోసోదరా!"*

ఇది రాజకీయాల షాకు కవిత. ఈ కవితలో షాకుతిన్న అనుభవం ఉంది; షాకు కొట్టే ఆర్జవముంది. అందుకే ఇది షాక్ కవిత అంటున్నాం. ఇందులో ఒక వాస్తవాన్ని అధిక్షేపించే లక్షణం ఎంతుందో రాజకీయాలలో షాక్ట్రీట్మెంట్ల వలన కలిగే విపరీత పరిణామాలను గురించిన హెచ్చరిక అంత ఉంది.

ఇవి నాటి వేమన్న పద్యాలు కావు; నేటి రాజన్న మెరుపుషాకులు.

షాకు కవిత మనసును కుదిపివేస్తుంది. మెరుపుకవిత మనసును దిమ్మర కలిగిస్తుంది. మచ్చుకొకటి

*"కులమతాలు కాలిపోతే*
*రాజకీయం రాణకెక్కదు*
*కుళ్లు వ్యవస్థ కూలిపోతే*
*కవికలానికి కవిత చిక్కదూ?"*

ఇదొక వింత ప్రశ్నలాగా కనపడుతున్నా రాజకీయ సాహిత్య వ్యవస్థల మీద నిశిత విమర్శగా నిగనిగ లాడుతుంది. సమాధానం దొరకక సతమత పడే స్థితిని పఠితకు కలిగిస్తుంది. అందుకే ఇది మెరుపులాగా మెరిసి కళ్ళను జిగేలు మనిపిస్తోందనటం.

సూర్యకిరణాల వంటి కవితలు ఈరెండింటిని రంగరించుకొని ఉంటాయి. అవి చురుక్కుమని కాలుస్తాయి; ముచ్చెమటలు పట్టిస్తాయి; అయినా వొంటికి ఆరోగ్యాన్నిస్తాయి.

సూర్యకిరణాలు వర్తమానానుభవానికి ప్రతీక. తాను అనుభవిస్తున్న తాజా పరిస్థితిని చూచి హర్షించి రాస్తే చంద్రకిరణం; తట్టుకోలేక గుట్టును దాచుకోలేక రట్టు చేయటం గిట్టకపోయినా అట్టహాసం చేయకుండా అధిక్షేపిస్తున్నట్లు చెప్పే షాకు మెరుపు కవితలు ఈ సూర్యాంశువులు'. షాకు మెరుపు పద్యాలే సూర్యాంశువులు!

ఇందులో వాస్తవాలు వాచ్యంగా చెప్పినవి ఉన్నాయి.

అందులో కొన్ని వాస్తవాలను వ్యంగ్యంగా చెప్పినవి ఉన్నాయి.

అందులోనూ కొన్ని వక్రోక్తులలో వ్యక్తం చేసిన వున్నాయి.

అందందు హాస్య కాంతులు పంచిపెట్టేవీ ఉన్నాయి.

ఇవన్నీ సందర్భాన్ని బట్టి వస్తువును బట్టి కవిచేత రూపొందింపబడ్డవి. వాచ్యంగా చెప్పే వాస్తవం నిష్ఠురంగా ఉంటుంది.

'పది పద్యాలు బట్టీ పట్టిన వాచాలురు
సభా స్వారాట్టులుగా వెలుగుతారు.
పదికోట్లు కుంభకోణంలో కాజేసిన దేశభక్తులు
కళా విరాట్టులుగా మెలుగుతారు."

నిజాలు నిష్ఠురాలుగా ఉంటే అన్నవాడూ, అనిపించుకున్నవాడూ, విన్నవాడూ ముగ్గురూ షాకు తింటారు. అది వ్యక్తి నిష్టం కాకుండా స్వభావ వ్యంజకంగా గ్రహిస్తే ఒక నవ్వు నవ్వి ఊరుకోవచ్చు. లేదా ప్రతి స్పందించవచ్చు. ఏమైనా ఈ కవిత వ్యక్తి దూషణకాదు. నిష్ఠురమైన నిజాన్ని నిజాయితీతో చెప్పిన కవిత. ఇటువంటివి రమణీయోక్తులుగా కంటె సూక్తులుగా రాణిస్తాయి.

"ఉదయం తాజా పువ్వులా
పరిమళించే బస్టాపులు
సాయంత్రం ఆగని బస్సులకోసం
అలసిన కళ్లతో పడిగాపులు"

రాజుగారు ఒక వాస్తవాన్ని చమత్కరించి వ్యంగ్య గౌరవాన్ని దానికి ఆపాదించారు. సిటీ బస్‌స్టాండ్సులోని ఆగచాట్లు వ్యంగ్య వర్ణ్యవస్తువు. అలసిన కళ్లు అలంకారమైతే, పూవుల పరిమళం పసందైన ధ్వని. అంత్యప్రాసల కోసం రాజుగారు ఆరాటపడతారు కవిత్వంలో. అది వారి వాగ్వృత్తికి సహజలక్షణం. అవి అర్థవంతంగా ఉన్నప్పుడు కవితకు సహజాలంకారాలౌతాయి. కాని, బలవంతాన తొడిగితే పెట్టుడు సొమ్ములుగా బరువౌతుంటాయి. "పడిగాపులు" పడక పోతే మరికొంత అందంగా వచ్చేదేమో కవిత!

"నిన్నటి నగరం అల్లుళ్లు
నేడు అమెరికా మావలు
నేటి అమెరికా అల్లుళ్లే
రేపటి అంతరిక్షంనావలు"

ఇది చక్కని ప్రౌఢమైన వక్రోక్తి! ఆపైన వ్యంగ్యోక్తి!

రాజుగారు ఎంత సీరియస్‌గా చెప్పగలరో అంత చిలిపిగాకూడా చెప్పగలరు. చిలిపితనం చిరునవ్వును చిలికింపజేస్తుంది.

"చద్దిమూట విప్పితింటే
పల్లెటూరి బైతు
చద్దిపెట్టె సరుకు తింటే
నవనాగరిక రౌతు"

'ఫ్రిజ్'కు తెలుగుమాటగా "చద్దిపెట్టె"ను పరిచయం చేయటంలోనే తెలివిదనం ఉంది. చిలిపిదనం ఉంది.

'సూర్యాంశువులు' కావ్యసంపుటి మొత్తం చదివితే నాకు 'ఆధునిక వీధి'గా అనిపించింది. షాకు కవితలు - ఇంతకు ముందే మనం పరిశీలించినట్లు - మూడు నాలుగు రకాల ధోరణులతో రచింపబడ్డాయి. కవిలోని కవితోక్తుల వింతధోరణులన్నీ కలిసి జంటనగరాల్లో, భరత రాజధానిలో, మరికొన్ని ముఖ్య పట్టణాల్లో విహరిస్తూ అడుగడుగునా తగులుతున్న షాకులకు ప్రతిస్పందిస్తూ రచించిన మెరుపు కవితలివి. అందుకే దీన్ని ఈ కాలపు వీధి రూపక మనవచ్చు! అభినవ వల్లభరాయలు మనరాజు!

రాజుగారి సరస్వతికి పంచముఖాలు. మొదటిది అరుణారుణ కాంతులతో ప్రజ్వలించేది. ఆ ముఖం

*"నారక్తం గంధం తీసి*
*తూర్పు మిత్రుని ముఖాన పూశాను*
*ఎర్రగా నవ్వేడు!"* - అని - ఎర్రగా నవ్వుతుంది.

*(సూర్యరథం)*

రెండవది అంతర్వాణి పలికే శ్వేతాననం. ఆమె జగన్మాతగా సర్వశక్తిగా పలకరిస్తుంది. సమసమాజాన్ని స్నేహ చిహ్నంగా అందిస్తుంది.

"ప్రకృతి సంపదనంతా తైలవర్ణాలలో చిత్రించి నీ పుట్టిన రోజు కానుగా ఇచ్చిన ఈ పటాన్ని అందరితోనూ అనుభవించు" అని అనునయించి చెపుతుంది.

మూడవది విశ్వచైతన్యంలా వెలుగొందే ముఖం. విశ్వంపట్టని విరాడ్రూపంలా విస్తరించే ఆ ముఖం

*"వెన్నెల అంబారీ మీద భూమినన్ను మోస్తున్న గజం*
*గ్రహాలకూడలిలో సూర్యుడు నేనెగరేసిన ధ్వజం"* - అని భావుకంగా నినదిస్తుంది.

నాల్గవ ముఖం, మార్మిక ముఖం. కాషాయకాంతితో కళలనీనుతూ ఉంటుంది.

*"వేలసూర్యుల కిరణాలు కరగించలేని*
*లక్షల జలపాతాలు కడిగించలేని*
*కోటి ప్రభంజనాలు కదలించలేని*
*స్వర్ణమై, స్వప్నమై, స్వర్గమై జ్వలిస్తున్న అక్షరాన్ని"*

అని ఆనందలాస్యం చేస్తుంది.

అయిదవ ముఖం మెరుపుల మేఘం. సూర్యకిరణాలే మెరుపులై వర్షిస్తాయి. మెరుపుకవితలై షాకులందిస్తాయి. సమాజానికి షాక్ ట్రీట్‌మెంట్ ఇద్దామని రాజుగారి అభిమతం. అయితే ఇది దిగంబరమైన షాక్ ట్రీట్‌మెంట్ కాదు. లేజర్ కిరణాల షాక్‌ట్రీట్ మెంట్!

కుమారస్వామి కావాలంటే మరో ముఖం ప్రదర్శించాలి. అంతటితో ఆగకుండా సప్తవర్ణముఖాలను సాధించాలి. ఆపైన సహస్రాంశు దీధితిని ప్రదర్శించాలి. రాజు వెలిగించిన సూర్యుడు నిజంలా, నిప్పులా నిత్యుడు!

ఒక సూర్యుడే అనేక నక్షత్రాలైనట్లు రాజుగారి సూర్యుడు అనేక కవితా సంపుటులుగా విస్తరించి వెలుగొందాలని ఆశిస్తున్నాను.

సూర్యాంశువులను మూటకట్టి మనిషికి కవితామృత బిందువులుగా అందిస్తున్నందుకు రాజుగారిని మనసారా అభినందిస్తున్నాను.

హైదరాబాదు,
21.8.1996

**జి.వి. సుబ్రహ్మణ్యం**

# ఒక మాట .....

**క**విత్వం ఎలా ఉండాలి! ఎప్పుడది ఉత్తమ కవిత్వం అనిపించుకుంటుంది? అని చర్చించడం మొదలు పెడితే - అది ఎప్పటికీ తేలదు. ఎందుకంటే కవిత్వపు అనుభవం సర్వకాల సర్వావస్థల్లోనూ ఒక్కలాగే ఉండదు కనక

మరో విషయం - కవిత్వం బహుముఖాలుగా ఎదురయే 'వ్యక్తి' జీవనానుభవాలను వాటి సూక్ష్మ లాలిత్యాలతో, ఉద్రిక్తతలతో, ఆవిష్కరిస్తే గొప్పదా? లేక, సామాజిక జీవనంలో ఎదురయే రకరకాల సమస్యలను స్పృశించి, చదువరిని ఎప్పటికప్పుడు హెచ్చరించేదైతే గొప్పదా? - ఇది కూడా చర్చల ద్వారా తేలని వ్యవహారమే

అన్ని సాహిత్య ప్రక్రియలలోకి కవిత్వం - ముఖ్యంగా ఆధునిక కవిత్వం - వ్యక్తి 'మేధ' కంటె 'మనస్సు' మీద అనుభవ పరిధిలో పని చేసే సూక్ష్మ ప్రక్రియ అని నేననుకుంటున్నాను. అలాగే - ఏమనిషి జీవితంలో అనుభవాలైనా, స్తబ్ధుగా ఒకే తరహాగా, ఒకే ఇతివృత్తాన్ని పట్టుకొని తిరుగుతూ కూర్చోవు. కోపం, తాపం, విరహం, వేదన, వెన్నెల, వేసవి, హర్షం, వర్షం, హాస్యం, లాస్యం, ఎన్నో అంతరువులున్నాయి. వ్యక్తి మనస్సుకి ఎన్నో కోణాలున్నాయి.

జీవితాన్నెరిగిన కవి ఈ అన్నికోణాలనూ ఆవిష్కరిస్తాడు. ఆవిష్కరించాలి. అప్పుడే జీవితమంత వైవిధ్యమూ ఒక వ్యక్తి ప్రకటించే కవిత్వంలో కూడా కనిపిస్తుంది.

ఇప్పుడు 'సూర్యాంశువులు' ప్రకటిస్తున్న రాజుగారు ఇంతకు పూర్వం 'సూర్యరథం', 'సూర్యధ్వజం', 'సూర్యకతారి', అనే కవిత్వ సంపుటాలు ప్రకటించారు. ఆ పుస్తకాలు చదివిన వారు వాటిలో ఇతివృత్తాలకీ, ప్రకటన విధానానికీ చాలా భిన్నంగా వుండే ఈ 'సూర్యాంశువుల' కీ, పోలిక తెచ్చి చూడకూడదనుకుంటాను. అవి వేరే మానసిక దశలలో, వేరే అంతరువుల్లో వ్రాసిన రచనలు.

సూర్యాంశువుల స్వభావం వేరు. వీటి ప్రయోజనంవేరు. అభిప్రాయాలు సంచరించే 'ఆవరణ' పరిమితులు వేరు.

దాదాపు ఒక దశాబ్దికాలంగా మనిషి బతుకును పాలిస్తున్న, ఛిద్రంచేస్తున్న అనేక సామాజికాంశాల మీద కవి ఒక్కొక్కసారి వ్యంగ్యంగా, ఒక్కొక్కసారి కసిగా, మరొక్కక్కసారి బాధగా దిగులుగా, చేసిన గచ్ఛద్వ్యాఖ్యలే ఈ కవిత్వం.

మొత్తంమీద ఈ సూర్యాంశువుల ద్వారా రాజుగారు చెప్పదలిచిన సందేశం ఇది.

"అంతరంగాన్ని శుద్ధి చేసుకొన్నప్పుడే అసలు రూపాన్ని ఆవిష్కరించుకోగలం నీతికి నియమాలకు బద్ధులమైతేనే నిజానికి, ధర్మానికీ, న్యాయంచేయగలం. దుష్టశక్తుల ఆగడాలు తుదముట్టించి దృఢ చిత్తంతో గెలిచేదే ప్రజాబలం."

సాధారణంగా ఇటువంటి కవిత్వానికి అవసరమైన "క్లుప్తత", "ముక్తకత" శ్రీరాజుగారు పాటించారు. చదువరికి ఆకర్షణకోసం అంత్యప్రాసను ఆశ్రయించారు. (ఛందస్సుకాకపోయినా) ఈ పుస్తకం చదవడం మొదలు పెడితే మిమ్మల్ని పలకరించే రకరకాల భావ చిత్రాలను, ఉదాహరణల పేరిట నేను ఇక్కడ పునరుద్ధరించడం చేయడం లేదు.

భావుకుడు, సౌమ్యుడు, పరిశీలకుడు అయిన కవి, ఈనాటి సమాజాన్ని చూసి .... చేసిన అనివార్య వ్యాఖ్యలుగా వీటిని అర్థం చేసుకోవాలి. పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రం సామెతగా, కవిగాని, అతగాడి కవిత్వంగాని, ఒకేలాగ ఉత్పన్నం కావాలని ఎక్కడా లేదు. ఈ ధర్మ సూక్ష్మం గ్రహించి చదవ వలసిన పుస్తకం ఇది.

15/8/96. **ఇంద్రగంటి శ్రీకాంతశర్మ**



పాల బుగ్గలతో తెల్లవారే తూర్పు
మద్యం 'పెగ్గు'లతో సద్దుమణిగే నిట్టూర్పు -
నగరం!



చద్దిమూట విప్పి తింటే
పల్లెటూరి బైతు
చద్ది పెట్టె సరుకు తింటే
నవనాగరిక రౌతు.



డబ్బును నీళ్లలా ఖర్చు పెడితే
విలాసం
నీళ్లను డబ్బులా వాడు కొంటే
నగర వాసం.



అనుకొన్నది కలిసి రాకుంటే
మంద భాగ్యులు
కులాలతో కలిసి బతికితే
'మంద' భాగ్యులు.



గాలి, వెలుతురు లేని
ఇళ్లల్లో నివాసం
అందుకే విద్యుత్తుతో
పెనవేసుకు పోయే సావాసం.



కలుషిత వాతావరణం
జనాల ఆరోగ్య హరణం
ఆసుపత్రిలో రోగులకు దొరకవు 'బెడ్లు'
'ప్రైవేటు' డాక్టర్లకు -
కరెన్సీ నోట్లే 'ఫోం బెడ్లు'



నాజూగ్గా ముస్తాబై ముళ్లడొంక
కుండీలో కూర్చొని కులుకుతుంది
వామనావతార మెత్తి ఊడల మఱ్ఱి
పెద బాబుల పొదరింట్లో కునుకుతుంది.



పాత నేస్తాలను పలకరించి
వచ్చేతీరు సదా ఆమోదం
సంప్రదాయం చెడకుండా అదే, సెలవు దినాన
'జూ పార్కు' లో జనం పొందే వినోదం.




అమ్మా, నాన్న, పిన్నీ, బాబాయ్
ఛీ పాడు - మోటు మాటలు
మమ్మీ, డాడీ, ఆంటీ, అంకుల్
హాయ్ హాయ్ 'స్వీటు' మూటలు



ఒంట్లో 'గ్యాస్' నిండు గుంటే
అయ్యో, రామా కడుపు మంటలు
వంటింట్లో 'గ్యాస్' నిండు కుంటే
అమ్మ బాబోయ్ ఆంటీల నోళ్ల ఫైరుగంటలు



మా 'ఫ్రిడ్జ్' చాలా మంచిది
మంచుకొండకు లేదు ఆ చలువ
మా 'సీలింగు ఫ్యాన్' ఎంతో గొప్పది
మలయ పవనానికి లేదు అంత విలువ



మా రంగుల 'టీవీ' సొగసు మీకేం తెలుసు
ఇంద్రధనుస్సు దాని ముందు దిగదుడుపు
మా 'వాషింగ్ మెషిన్' ఉతుకే - ఉతుకు !
మా బట్టలు మల్లెపువ్వును మించిన తెలుపు.



మా నాన్నగారు పెంచిన కుక్క
సింహాన్నే ఎదిరించి నిలబడింది
మా అమ్మమ్మ గారు పెంచిన పిల్లి
పెద్ద పులి మీదే కలబడింది




మా వారు నిజంగా ధర్మరాజు
తోటి వాళ్లే నేర్పేరు తాగుడూ, జూదం
మా స్వామీజీ సాక్షాత్తు ఆదిగురువు
ఆయనకే తెలుసు క్షుణ్ణంగా వేదం



ఇవీ! బాబాయిలను 'డ్యూటీ'లకు పంపి
పిన్ని గార్లు వినిపించే 'కేసెట్లు'
ఓపిగ్గా 'రికార్డు' చేసు కొంటే
హాయిగా నవ్వు కోవటానికి ఇవో రకం 'విట్లు'!




ఉదయం తాజా పువ్వులా
పరిమళించే బస్టాపులు
సాయంత్రం ఆగని బస్సుల కోసం
అలసిన కళ్లతో పడిగాపులు.



ఊరి పొలిమేరల్లో మోటుగా
జాతర్లందుకొనే దేవతలు
నగరం నడిరోడ్లలో కొలువై, 'నీటు'గా
అందుకొంటున్నారు 'దావతు'లు




దేవుళ్లను కూడా 'షెడ్యూల్డు' తెగల
జాబితాలో చేర్చారను కొంటా మన వాళ్లు
నగరంలో సైతం, కొండల మీద
గుట్టల మీద కడుతున్నారు గుళ్లు.



నగరం అల్లుళ్ల కోసం
పస్తులతో వేటాడిన కళ్లు
నివేశన స్థలాల
సరిహద్దుల్లో పాతేసిన రాళ్లు.




కూలీ అయినా, మాలీ అయినా,
కుర్రాడు నగరంలో ఉంటే 'భేషు'
బంగారు బొమ్మ నడుముకు
ముచ్చటగా కట్టొచ్చు మరోలక్ష 'క్యాషు'



కత్తెర కళ్లు బరువెక్కిన
జేబులనే పసిగడతాయి
ఆటోరిక్షాలు పగబట్టిన
పాముల్లా బుసకొడతాయి.



'మెయిన్ రోడ్లు' నిజమే
పరుగెత్తే పద్యాలు
'లింకురోడ్లు' బాబూ జాగర్త
అవి పడగొట్టే మద్యాలు.




'టీన్ ఏజ్' పాపలకు
అందాలు పెంచే నైటీలు
'టీ ఏజ్' 'అంటీ'లకు
బందాలు వేసే 'టైటీ'లు



పది పద్యాలు బట్టీ పట్టిన వాచాలురు
సభా స్వారాట్టులుగా వెలుగుతారు
పది కోట్లు కుంభకోణంలో కాజేసిన దేశభక్తులు
కళావిరాట్టులుగా మెలుగుతారు .




కవిత్వం కంపు కొడుతుంటే
సందేహం లేదు అది మధుశాల
అనుబంధాల పుటల్లో తూలుతూ
ప్రత్యక్ష మౌతుంది ఏ రాతల్లోనో దాని లీల.



నగరం శివార్లలో యధేచ్ఛగా
జరుగుతుంటాయి లూటీలు
మీ కర్మకు మేం కర్తలం కాదంటూ
హాయిగా నిద్రపోతుంటాయి లాఠీలు.



వ్యక్తి స్వేచ్ఛ మీద అనర్గళంగా
ఉపన్యసించే వదరు బోతులు
తోటివారి ఇబ్బందిని ఇసుమంతైనా
ఖాతరు చెయ్యని 'పొగ'రబోతులు.



మురికి గుంటలు కొలువు తీరిన
'చార్ సౌ సాల్ శహర్' నవనందనం
పోలీసులతో బల్దియాలు కుమ్మక్కయ్యారు
పహరాకాచే దోమా! నీకు వందనం!!




నిన్నటి నగరం అల్లుళ్లు
నేడు అమెరికా మాఁవలు
నేటి అమెరికా అల్లుళ్లే
రేపటి అంతరిక్షం నాఁవలు



'చౌరాస్తా' ల్లో పలకరించే
'జైంట్ కటౌట్ల' చిద్విలాసం
అందంగా వంచించే, క్షుద్ర
రాజనీతికి సిసలైన విలాసం.



వడ్డించుకొన్న విస్తరి తొలగించినందుకు
తెల్లోడు పెట్టిన శాపం
నడివీధిలో ఆచ్ఛాదనలేని
మహానాయకుల శిలారూపం.



దివ్య సుందరిలా మురిపించే
'షోకేస్' బొమ్మకు చుట్టిన వలువలు !
కొలతల కందని అంగాలతో అలరారే
ఏ అతివ సొగసుకు తెస్తాయి విలువలు ?



మందిని 'పరేషాన్' చేస్తూ 'స్టేజీ' కి
ఆమడ దూరంలో నిలబడితే, 'సిటీ బస్సే'
బుద్ధిగా 'బస్టాపు'లోనే నిలబడితే
ఆ రోజు నీకు 'డ్యూటీ' 'మిస్సే' !!



ఒళ్లలవకుండా పగలంతా
సంపాదన సంతలో 'ఫైటింగు'లు
నరాల బిగువు సడల టానికి
'మోర్నింగ్‌వాక్'లూ 'డైటింగు'లు



రైతే రాజు కావాలన్న ఆర్యుల
ఆకాంక్ష అక్షరాలా నిజమైంది
ప్రజాస్వామ్యాన్ని నడిపేది సన్న'కారు'
చిన్న'కారు'రైతులేనన్న వాస్తవమ్రుజువైంది!



నడ మంత్రపు సిరితెచ్చిన బుద్ధులు
పెళ్లి విందు కళాయిల్లో మెతుకులు ఏరుకొంటాయి
మందు గ్లాసుల ముందు బలపడ్డ స్నేహ బంధాలు
మంచి నీళ్లకుళాయిల దగ్గర చింది ఎగురు తుంటాయి.



(అ)

వట్టి గడ్డి దిట్టంగా పేని
కవిత లంటున్నాడు బాపురె !
కాంక్రీటు దిమ్మల్లోంచి , కవిత
పిండుకొనే తిప్పలు వద్దు మాకొరె !!



(ఆ)

కవిసమ్మేళన ప్రాంగణం లో
ఇది, సాహితీ ప్రియుల సణుగుడు
సభల్లో  కుర్చీల బోసి నవ్వులే,
పా'షండ' కవుల పైత్యానికి విరుగుడు



కొందరు ఆర్జన వీరులు - ఏ దుర్గాన్నైనా
ఛేదించుకుపోయే, వారిది ఖరీదైన బుర్ర
పాపమెవ్వరూ ఖాతరు చెయ్యరు - చక్కెర కూడా
కంచం ముందు, కసిగా ఝుళిపిస్తుంది కర్ర!




స్మశానాలు సైతం కబ్జా చేసుకొంటూ
వికృతంగా వ్యాపిస్తోంది 'భూ'తాల నీడ
నగర వాసులను పీల్చి, సదా
పీడించేది జలాసుర చీడ




ఇరుగు పొరుగులతో సత్సంబంధాలు
ఇంటి 'వానరు'ల కాళ్ల కింద నిప్పులు
వాళ్ల కనుసన్నలలో మెలగ కుంటే
అరుగుతాయి ఏడాదికి మూడు జతల చెప్పులు



ముద్దుగా మనం పెరట్లో పెంచుకొన్న చెట్లు
తల విరబోసుకు, పక్కింట్లో విదిలిస్తాయి
బుద్ధిగా - పూలూ, పళ్లూ మన కర్పించి
పక్కవాళ్ల పాట్లు చూసి పళ్లికిలిస్తాయి.



కులమతాలు కాలిపోతే
రాజ కీయం రాణ కెక్కదు !
కుళ్లు వ్యవస్థే కూలి పోతే
కవి కలానికి కవిత చిక్కదూ ?



గండాలు గడచి, నగర వాసానికి
ఎప్పుడు తరలి వస్తుందో కృష్ణ ?
అందాకా, 'డ్రెయినేజీ వాటరు'తో
ఎంచక్కా తీర్చు కొందాం తృష్ణ




నెలకు మూడు బందులు, ఆరు ధర్నాలతో
శివమెత్తి రాజకీయం రంకె వేస్తుంది.
బరువు బతుకుల బడుగు జనం, పూట గడవక
ముసుగులో ముడుచుకొని మూడంకె వేస్తుంది.




'కోట్ల' ఋణం సింగారించుకొని
ముస్తాబౌతోంది 'మెగా సిటీ'
ఖుషీ చేసేది నాయకు లైతే
మనకు మిగిలేది 'సెల్ఫ్ పిటీ'.



ఆధునిక సౌకర్యాలతో తులుకుతూ
విలాసంగా బతికే కొందరాడవాళ్లు
కూరగాయల బళ్ల దగ్గర మాత్రం
లేకి తనానికి అందమైన ఆనవాళ్లు.



ఆదర్శాలు వల్లించే కొందరాధునిక కవులకు
అరాచకంగా బతకటమే ఆచారం కా మో లు
ఆమాట ఎవరైనా వేలెత్తి చూపిస్తే
దూకుడుగా జబ్బ చరిచి దువ్వుతారు కాలు.




శిథిల భవనాలలో చిన్నారులకు
ప్రభుత్వం మార్కు మొక్కు'బడులు'
ప్రజా ధనం వృథాగా 'మైకు' పాల్జేస్తూ
'అందరికి అక్షరాస్యత' నినాదాల జడులు.



పచ్చి మాంసం పీక్కుతినే రాబందులకు
పైరగింజలు ఏరుకు తినే పక్షుల భాష తెలియదు
పరిమళోద్ధతితో మిడిసి పడే సంపెంగ పువ్వు
భ్రమరాల నాహ్లాద పరచే రస శాస్త్రం ఎరుగదు.



అరవై పేజీల, నైతిక విలువలు కోల్పోతే తప్ప
అరపేజీ ప్రచారం లభించట మెంతో కష్టం.
ఆత్మవంచనతో ఆర్భాటంగా వెలిగే కంటే
అనామకుడిగా ఆరిపోవటమే కవిరాజు కిష్టం.



'వందేమాతరం' అంటూ
నాటి నేతలు తెచ్చి పెట్టేరు స్వరాజ్యం
'మందే' మాతరం అంటున్న
నేటి నేతలకు సర్వం భోజ్యం
నాలుగు దశాబ్దాలు గా
అన్నదాతలకు మిగిలింది పూజ్యం



'ఇందిరా'యే ఇండియా
అన్న 'బారువా'చాలత్వం
ఆమె ప్రాణాన్ని కాపాడలేని
తీరు వెధవాయత్వం
కోటి ఆశలతో ఓటిచ్చి పంపిన
మనల్ని ఉద్ధరిస్తారనుకోవటం అమాయకత్వం



ప్రాంతీయ దురభిమానం
సమైక్యతను భంగ పరచే సూత్రం
ప్రత్యర్థుల మీద ప్రయోగించటానికి
ఎవరు ఉపదేశించారు ఈ మంత్రం.
అస్సామ్,అకాలీ ఉద్యమాల గుట్టు
విప్పితే బైట పడుతుంది కుతంత్రం.




దారిద్ర్యం, నిరుద్యోగం
దేశాన్ని పట్టి వేధిస్తున్న చీడ,పీడలు
అయినా ఘనంగా జరిపించాం
కోట్లు వెచ్చించి ఆశియా క్రీడలు
అని చెప్పుకొనే నాయకుల్లో
మచ్చుకైనా కానరావు సిగ్గు బిడియాల జాడలు.



అవినీతిని ఆచారంగా మార్చుతూ
అనుశ్రుతంగా వస్తున్న అనువంశక పాలన,
ముఖ్యమంత్రుల్ని పావులుగా మార్చుతూ
ప్రజాస్వామ్యాన్ని చేసింది అవహేళన
పదవి మైకంలో మిడుకుతూ
ఎవరు పట్టించుకొన్నారు సామాన్యుని ఆలన?



పదిలం కావాలంటే మనుగడ
విభజించి పాలించటం ఆంగ్ల రాజనీతి
కుల మత భేదాలు పెంచి ప్రభుత
కల్లోలం రేపింది అనుసరించి ఆ రీతి
రాబోయే బతుకు తలచి
జనావళికి పాకుతోంది వెన్నులోంచి భీతి.




గరీబీ హఠావో నినాదంతో
ఎన్నికల్లో చేసిన వాగ్దానాలు నీటి బుడగలు
దాహం తీరని ధనికులు
ఎత్తుతూనే ఉన్నారు కోట్లకు పడగలు
విస్తర్లు పరుచుక్కూర్చున్న పేదల
కడుపుల్లో విరుచుకు పడుతున్నాయి పిడుగులు.



ఎంత చిన్న చూపు చూస్తున్నా
తెలుగు జాతి అందించిన సహకారం అతి సాంద్రం!
ఐన వాళ్లు తరిమేస్తే, అమ్మను
ఆదరించిన ఆంధ్రావనికి ఏమిచ్చింది కేంద్రం?
విశాఖ ఉక్కును ముక్కలుగా పంచి
మంగళగిరి టైర్లకు చేసింది కదా రంధ్రం!



వర్ధమాన దేశాలకు
కార్మిక శక్తి ఆయువు
భద్రతా ఏర్పాట్లు లేక, జనావళిని
కబళిస్తోంది, పడగెత్తిన విషవాయువు
ప్రజల గోడు పట్టించు కోదు కేంద్రం
రాష్ట్రాలను పడగొట్టే జిత్తుల మారి గోమాయువు.




అమ్మగారు ఏలిన దేశంలో
తీరేయా ఆడవాళ్ల బతుకుల్లో కష్టాలు?
వరకట్న పిశాచి నవ్వులతో
ప్రతిధ్వనిస్తున్నాయి కదా కాష్టాలు!
అత్యాచారాలు అణచటానికి
సరిపడనే లేదా మనకున్న చట్టాలు?



కోట్లాది దేవతలు కొలువున్న దేశమిది
మోసాలు చెయ్యటం తేలిక
నెత్రు మరకలు నాకు తూనే
దైవ నామం జపించొచ్చును నాలిక
ఒక దారే ఎన్నుకోండి బాబులూ
ద్వంద్వ ప్రవృత్తులు చాలిక.



ప్రజాసేవ నినాదాలు
స్వయం సేవ ముసుగుల్లో శివమెత్తిన అరుపులు
ప్రజల నులి వెచ్చని కన్నీళ్లు
నాయకులకు సుతి మెత్తని పరుపులు
అందుకే మాననీయరు, జాతి ఒంటి మీద
సెలవేసిన కులం, మతం కురుపులు



సందేహం లేదు అందరూ
'కడియం పులు'లే మన నాయకులు
ఎంతటి పెను తుఫానులో నైన
నేర్పుగా ఒడ్డున చేరగలిగే మహానావికులు
ప్రజలు గుడ్లురిమితే మాత్రం
ఘనంగా నిమ్మజ్జన మయ్యే వినాయకులు.




జోరుగా పడుతూ ఉండాలి
క్రికెట్టు ఆటలో ప్రత్యర్థుల వికెట్లు
అకస్మాత్తుగా మొలుస్తూ ఉండాలి
సరిహద్దుల్లో పొరుగు రాజ్యాల సైనిక పికెట్లు
ఎన్ని కుంభకోణాలు బైట పడుతున్నా
నాయకులను వేధించవులే విమర్శల రాకెట్లు.



ప్రజల్లో తమ ప్రభలు చెరిగి పోతున్నాయని
ప్రభువులకు కలిగి నప్పుడు శంక
కత్తులు, తుపాకీ మడమలు, పిస్తోలు గుండ్లు
కూడా విసురుతాడు విశ్వాస పాత్రుడైన లెంక
ఏ దేశ నాయకుడైనా తోడ్పడతాడు
వాడికి కూడా అదే కదా సదా తెంక.



రంకు, బొంకులు మరిగినోళ్లు
ఇహలోకపు యక్షులు
పచ్చ పచ్చని చెట్ల మీదికి
ఎగిరి పోయే పక్షులు
రాజకీయం కలిసి వస్తే
వీళ్లే కదా రాజ్యమేలే దక్షులు!



భజన పాటల్లో మితిమీరి
వినబడుతున్నప్పుడు అపస్వరాలు
బిర్రబిగుసుకు పోతాయి
నాయకుల ఆయువు పట్టులోని నరాలు
హుటా హుటీ దిగి వచ్చి ఉదారంగా
ప్రదానం చేస్తారు ఆచరణ సాధ్యం కాని వరాలు.



కవులు చాలా ఘటికులు, సాహసంతో
చేస్తారు 'లావా' దేవే క్రియలు
తస్మాత్ జాగ్రత అందులోనూ
ఉన్నారు లావాదేవీ ప్రియులు
నాలుకకీ పాళీకి పొంతన కుదరక, కలం
గొంతులో తప్పుతున్నాయి శ్రుతి, లయలు.



పదవుల కుమ్ములాటలో
ఓటేసిన ప్రజలెప్పుడూ పావులే
మత కలహాల ముసుగులో
నడి వీధిన నెత్తురోడే చావులే
అరాచకం గద్దె నెక్కిన చోట
సత్యం, అహింస అందని ఎండ మావులే




మందు కొట్టించిన వాణ్ణి మంచి కవిగా కీర్తిం
చే, రాతలు కాలేవు కవితా లక్షణాలు
సిసలైన కవిత్వాన్ని ఎల్లప్పుడూ, ఒడుపుగా
వేటాడుతూనే ఉంటాయి విహంగ వీక్షణాలు
చౌక'బారు' ప్రచార కవుల జాడల్ని కూడా
చెరిపేస్తాయి చక్రాలు తిప్పే క్షణాలు.



మౌఢ్యం, మంచితనాని కెప్పుడూ
వేస్తూనే వుంది నిలువెత్తు శిలువ
ప్రజాధనం ఫణం పెట్టి పాచికలు
ఆడుతుంటాడు జెండాలు మార్చేతులువ
కోట్లు కూడ బెట్టుకొన్నా, ఖలుడు
సాధించగలడా విలువైన విలువ?



ఐదేళ్ల కోసం అధికారమిస్తే, ‘శత’
దినోత్సవాలు జరుపుకోవటం సిగ్గు చేటు
మద్యం మనీల విషపు కౌగిట్లో నలిగి,
మలిన మై పోయింది పవిత్రమైన ఓటు
‘సారా’జులు ‘రే’రాజులు ప్రభువులైతే
మరు భూమే ప్రజాస్వామ్యాని కనువైన చోటు



ఏం కీర్తించాలి నేతల వీరగాథలు
అంతా నేరాల ఘనాపాటీలే
వేదాలు వల్లిస్తూ, ఇరు పక్షాలు
అభ్యర్థుల ఎంపికలో పోటాపోటీలే.
పత్రికల సాక్షిగా - పాలితులకు
వెనుక లాఠీలు, ముందు లూటీలే!



నిజాన్ని నిలువునా పూడ్చి పెట్టటానికి
సదా సిద్ధంగా ఉంటాయి కమిషన్లు
కల్నాయకుల అంతరంగాల శుద్ధికి
ఎన్నని సమకూర్చు కోగలం లోషన్లు?
మన చట్టాల పరిరక్షణ కోసం
అవశ్యం కావాలి జాతి ఆల్ శేషన్లు



కాషాయం తెర చాటున
పచ్చి నెత్తుటి లోయలు
గణతి కెక్కిన నేతలంతా
స్వామి పల్లకి బోయిలు
సాధువేషం, నేత హాసం
అంతు చిక్కని మాయలు.



అనాదిగా తిరిపెమెత్తి జీవించుట
పెద్దలు మనకిచ్చిన వారసత్వ హక్కు
దేశాంతర వీధుల్లో ప్రజల పేర బిచ్చమెత్తి
ఓట్ల బిచ్చగాడెంతో వాటంగా మెక్కు
ఆది భిక్షువా, అప్పుచేసి కొండెక్కిన
వాడా - ఏ దేవుడు మన కౌతాడిక దిక్కు ?



ఒకే లోగిలి మీద రెండు జెండాలు!
రాజకీయం అంతుపట్టని ప్రహేళిక
'పొజిషను', 'అపొజిషను' మనదే అయితే
దేశమే సురబిళ సువర్ణ సుమ డోలిక
అప్పుకొయ్యకు జాతిని శిలువ వేసి
వేడుకగా పాడ వచ్చు అధినాయక గీతిక




రాజకీయం కుటుంబాల పాలైతే
ప్రజాస్వామ్యానికి నడివీధిలో పాతర
పదవి మీద ఉన్మాదం ప్రకోపిస్తే
స్టార్ హోటళ్లలో వెన్నుపోటు దార్ల జాతర
ఉపద్రవం ఉప్పెనలా ముంచుకొస్తోంది
కళ్లు తెరచి దేశాన్ని కాపాడుకో సోదరా!



శాంతి మంత్రాలతో వెలుగొందిన దేశం,
ఎల్లెడలా రాజకీయ వ్రణాలే
ఉసిగొల్పితే చాలు విచక్షణ లేకుండా
విధ్వంసంలో మన వాళ్లు రక్కస గణాలే
హాయిగా సశ్యఫలాన్ని తామనుభవించి
నేతలు - జనతకు మిగిల్చేది వట్టి తృణాలే



చట్ట సభల్లో దినానికో కోటితో రభస,
జనతాభిమతానికి స్వేచ్ఛా ప్రతీకలా?
అంతై అంతంతై, అంతకునంతై, మరంతై
విస్తరిస్తున్న స్వార్ధ రక్కసి ఆకలి కేకలా?
ప్రజారాజ్యాన్ని ప్రగతి బాట నడిపేది
చీకటి దొరల గొంతుతో అరిచే ఈ మూకలా??



నిజానికి ఎవరు అనుభవిస్తున్నారు
దేశంలో స్వేచ్ఛ, స్వతంత్రాలు
వాడ వాడలా ప్రవహిస్తున్నాయి
యధేచ్ఛగా కుళ్లూ, కుతంత్రాలు
జాతి గుండెల్లో నింపుతున్నాయి తిమిరాలు
తాంత్రిక నేతల మాయలూ, మంత్రాలు.



నిజాయితీ గా ఎదుర్కో
లేనప్పుడు విపక్షాల సవాలు
రాజకీయాల్లో అమోఘంగా
పని చేస్తాయి అస్త్రాల్లా శవాలు
గతి తప్పిన వ్యవస్థలో
మును ముందు విషపురుగుల ప్రసవాలు



దేశోద్ధరణకు కంకణం కట్టుకొన్న
త్యాగ ధనుల శీలాన్ని శంకిస్తూ సవాలా ?
ప్రమాణాలు చేసి పదివి కెక్కిన నాయకుల
నిజాయితీకి అద్దం - బోఫోర్సు, హవాలా!
నీతి మంతులైన నేతల ఏలుబడిలో
ఖజానా - డాలరు ఋణాలతో దివాలా !!




'పోలిటిక్సు' గజేంద్రజాలకునికైనా
అందని మహోన్నతమైన ట్రిక్కు
పదవి మైకం మాదక ద్రవ్యాలను
మించిన చెదిరి పోని కిక్కు
చట్ట సభా రంగ ప్రవేశం నాడే
శ్రీవారి నామం 'స్విస్సు' ఖాతాల కెక్కు !



ఎన్నికల పర్వంలో ప్రజలే
కళ్లల్లో కదలాడే దేవుళ్లు
పిదపకాలం! సంఘ విద్రోహులకు
రక్షిత స్థావరాలు తమ లోగిళ్లు
నేతలూ! మీరే సర్వాధి పతులు
దోచుకోండి గోపురాలూ, గుళ్లూ.




బడ్జెట్టంటే ఇంతులకు, దంతులకూ బెదురే
వడ్డింపులు తప్పవని గుడ్డమీద, గడ్డిమీద
అంకెల గారడీతో ఆర్థిక మంత్రి గారు
వదులుతారు భారాన్ని సుతారంగా నడ్డిమీద
తెలియకుండానే మసి అలుము కొంటుంది
గుడిసెల్లో కొడిగట్టిన దీపం బుడ్డిమీద.



నేతలందరిది ఒకటే గురుకులమో ఏమో ?
అంతా పలకమారిన నీతి బీరకాయలు
మోసు కొచ్చిన లారీల సాక్షిగా, ప్రజలు
మెత్తగా తెగుతున్న లేత సొరకాయలు
ఓటుతో వాటంగా ఖండించాలి
నేల పడకుండా రాకాసి తలకాయలు.



తప్పులు కప్పి పుచ్చు కోవటానికి పరస్పరం
వీధిన పడి దూషణ పదాలతో కసరత్తులు
ఓటర్ల చెవుల్లో మందార పూలు పెడుతూ
ఎన్నికల రణరంగంలో సిగ్గువిడిచి పొత్తులు.
అమాయక ప్రజల కెప్పుడూ గాయాలే
నేతల చేతలు రెండు ధారల కత్తులు



అక్రమార్జనలు పదిల పరచుకొనేందుకు
రాజకీయాలే అనువైన మార్గం
ఎన్నికైన మరుక్షణం వేల కళ్లతో
రక్షణ కల్పిస్తుంది విద్రోహ వర్గం
ఐదేళ్ల ఆయుధాన్ని మెలకువతో వాడి,
ఛేదించాలి కరడు కట్టిన భూతాల స్వర్గం.



నిర్మలంగా ఓటు వేసి నిలువునా
ఓడి పోతుంటాడు నిర్భాగ్య ఓటరు
నల్లడబ్బుతో గద్దెనెక్కి దర్పంతో
వెక్కిరిస్తుంటాడు నేటి రౌడీ షీటరు
రేపటి హత్యారాజకీయాలకు
వాడే ఆరితేరిన ప్రమోటరు.



పేదల సేవకే జీవితమంకిత మంటూ
ఎన్నికల్లో వంగి అడుగడుగునా దండాలు
పల్లె పట్టునుంచి పార్లమెంటు దాకా
విషం కక్కుతూ పాకుతున్నారు గూండాలు.
విద్రోహులతో చేతులు కలిపి, దేశం
నలుమూలలా సృష్టిస్తున్నారు సుడిగుండాలు.




వాగ్దానాలు నెరవేర్చేందు కంటూ
ప్రభుత్వం ఆమోదించిన పద్దులు,
ఆగామి ప్రభుత్వం ఆవేశంతో
నిర్ద్వంద్వంగా చేస్తుంది రద్దులు.
ఐదేళ్ల కో పుట్టిన రోజు జరుపుకొంటూ
ప్రజల సమస్యలు దాటవు సరిహద్దులు.



అయోగ్యులు అందల మెక్కి నప్పుడే
ఆరంభమైంది జాతీయ విపత్తు
'కుంభ' కర్ణుల ఆకలి తీర్చటానికే
చాలటం లేదు మన సంపద యావత్తు
కండలు కరిగించే కర్మ వీరులకు
కడుపు నిండా కొండంత ఆరని క్షుత్తు




రాజకీయ గరళం నెత్తికెక్కితే
మనసంతా దుష్టవ్యూహాల మయం,
నడవడిలో నాణ్యత లోపించి నప్పుడు,
అడుగడుగునా వెంటాడే మృత్యుభయం
మన ప్రజా ప్రతినిధుల భద్రత కోసం,
దేశ రక్షణకే కానంత వృధా వ్యయం.




ఆకలితో ఉన్నంత కాలం పోరాట పంథాలో,
ఆవేశంగా అరుస్తూ పలుకుతారు సుద్దులు.
అవకాశం రానంత వరకు శుద్ధ పూసలే,
ఇజాలకు, సిద్ధాంతాలకు నూరు పాళ్లూ బద్ధులు.
అధికారం చిక్కితే అన్నీ విస్మరించి,
నేరస్తుల మొదటి వరుసలో నిలిచే ప్రబుద్ధులు.




అధికారంలో ఉన్నప్పుడు శిలా సదృసులే,
ప్రతి పక్షంలో కూచుంటే కరుణ రస సిద్ధులు
ప్రజల కడగండ్లకు కరిగి, ప్రచార సాధనాల
పతాక శీర్షికల్లా కారిపోయే విశుద్ధులు.
జెండా పండుగల రోజు దేశభక్తి బోధకులు;
ఘనులే లే మన నేతలు అన్నిట ప్రసిద్ధులు!



చట్టాల్లోని లోపాలు సవరించుకొంటూ
మంచి పాలన అందించే వారు మాన్యులు
ఆదర్శ పాలకుల కోసం - విజ్ఞతతో
ప్రలోభాలకు లోనుకాని వారు ధన్యులు
సిరి సంపదల కొరకు సదా పాకులాడుతూ,
జాతికి దూరం కానివారే మూర్ధన్యులు.



అంతరంగాన్ని శుద్ధి చేసు కొన్నప్పుడే,
అసలు రూపాన్ని ఆవిష్కరించు కోగలం.
నీతికి, నియమాలకు బద్ధుల మైతేనే,
నిజానికి, ధర్మానికి న్యాయం చెయ్యగలం.
దుష్ట శక్తుల ఆగడాలు తుదముట్టించి,
దృఢ చిత్తంతో గెలిచేదే ప్రజాబలం.




రాజకీయాలు - నెత్తుటి కూటి సోమరులు
ఈదులాడు కొనే ఆనందపు సంద్రాలు.
స్వయం ఉపాధి పథకాలే పార్టీలు
జులాయి మూకలకు నీడ నిచ్చే శిలీంధ్రాలు.
ప్రజా పాలన కొరకు ఏర్పడ్డ చట్ట సభలు
నేడు, నేరస్తుల పునరావాస కేంద్రాలు.



ముద్ద ముద్దకు ఎందుకు ఏరతావు వెంట్రుకలు
నువ్వు కలుపు కొనేది కంచం కాదు కంబళి!
వనాల మీద వసంతాలు శోభిల్లేది
సీతాకోక చిలుకైనప్పుడే కదా గొంగళి?
మషీరసంతో పులు కడిగి మనో నేత్రాన్ని
ఆవిష్కరించేదే కవిరాజు కలం కేళి.